Acc no : 28308

# మహర్షి దయానందుని
# ఆదర్శ రాజనము



స్వామి దయానందసరస్వతి

కర్త :

స్వామి సోమానంద సరస్వతి (పం. నరేంద్రజీ)

అనుకర్త :

టి. సూర్యనారాయణ


ప్రకాశకులు :

గాయత్రీ ఆశ్రమము (ట్రస్టు)

వ్యాస్‌నగర్, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 361

ప్రజోత్పత్తి మార్గశిరము

మూల్యము : రు. 1-00

ప్రతులు : 2,000

# ప్రకాశకీయము

మహర్షి దయానందుడు గొప్ప క్రాంతికారి. ఆతడు సామాజిక, ధార్మిక, రాజకీయ రంగములలో గొప్ప క్రాంతిని సృష్టించెను. ఆతడు తెచ్చిన సామాజిక సంస్కరణలు రాజకీయ ఉద్యమమునకు, దేశ స్వాతంత్ర్య సంగ్రామమునకు ఆదర్శములయ్యెను. ఆతని ఆర్య చక్రవర్తి రాజ్య ఆశయము గాంధీజీ రామరాజ్య ఆశయమునకు అనుగుణ్యమైనదే. సత్యార్థ ప్రకాశ షష్ఠమ సముల్లాసములో రాజకీయ సిద్ధాంతములను వివరించెను. వీటి లక్ష్యము ధర్మానుసరణమైయున్నది. ఈ లక్ష్య సిద్ధికే సర్దారు భగత్సింగు, రాంప్రసాద్ బిస్మిల్, హరదయాళ్, స్వామి శ్రద్ధానంద్, లాలా లజపతిరాయ్, హకీకత్ రాయ్ మొదలగు వారు ఆత్మాహుతి గావించుకొనిరి.

స్వామి సోమానంద సరస్వతి (పండిట్ నరేంద్రజీ) గారి యీ లేఖ (వ్యాసము) 1954లో అష్టమార్య మహా సమ్మేళన సందర్భమున ఉర్దూ "మిలాప్" లో, తర్వాత లక్నోనుండి వెలువడు "ఆర్యమిత్ర" వారపత్రికలో ప్రచురించబడెను. క్రీ.శ. 1976లో ఉద్గీర్ సమ్మేళనములో పఠించబడిన యీ వ్యాసము పుస్తక రూపములో ప్రచురించబడినది. తెలుగు పాఠకుల సౌలభ్యము కొరకై వారి యీ పుస్తకము తెలుగులో ప్రచురించబడుచున్నది. స్వామి సోమానంద సరస్వతి గారు వైదిక ధర్మమునకు ఆర్య సమాజ సంస్థ ద్వారా చేసిన సేవ, ధర్మోద్ధరణకై గావించిన త్యాగము మరపురానివి. వారు చిరస్మరణీయులు. వారికి మనమెంతో ఋణపడి ఉన్నాము.

"మహర్షి దయానందుని ఆదర్శ రాజ్యము" అను యీ చిన్ని పొత్తములో మహర్షి ఆశించిన రాజ్య రూపు రేఖలు క్లుప్తముగా వివరించబడినవి. అట్టి ఆదర్శ రాజ్యము యేర్పడినప్పుడు మాత్రమే సుఖ శాంతులు వర్థిల్లగలవు.

ప్రకాశకులు

ఓ ౩ మ్

# మహర్షి దయానందుని ఆదర్శ రాజ్యము

అనుకర్త : టి. సూర్యనారాయణ

మహర్షి దయానందుడు గొప్ప దేశభక్తుడే గాక రాజనీతిజ్ఞుడై యుండెను. బ్రిటిష్ సార్వభౌమాధికార పిపాస భారతదేశ రాజకీయ, సామాజిక వ్యవస్థను అస్తవ్యస్తము జేయుటయే గాక భారతీయుల స్వాతంత్ర్యమును నలిపివేసెను. వారి జాతీయ జీవన విధానానికి గొప్ప విఘాతము కలిగించెను. మహర్షి 1857 నాటి విప్లవ దృశ్యము లను కన్నులారా తిలకించుటయే గాక దేశభక్తులు ఉరికంభముల కెక్కుటయు వారికి విషాదము కలిగించెను.

## ధర్మ మాధారముగా రాజనీతి సంఘటన

భారతీయుల ఆర్థిక, సామాజిక, నైతిక జీవనము దుర్బల మగు చుండెను. దానిని శృంఖలాబద్ధ మొనరించుటకై రాజకీయ అధికార మవసరమై యుండెను. అందుకై వారివద్ద ధార్మిక పునర్జాగృతి (Religious Renanciance) మరియు అన్ని మతముల వారిని ఒక వేదికపై తెచ్చుట యను మార్గము లుండెను.

దేశ అభ్యున్నతికి, స్వేచ్ఛకై అన్ని మతములు, సాంప్ర దాయముల వారిని ఒక వేదికపై తెచ్చుట వారి లక్ష్యమై యుండెను. ప్రజలు మహర్షి యోజన ననుసరించినచో భారతదేశములో ఆంగ్ల ప్రభుత్వ ప్రేళ్ళు కదిలిపోవునని ఆంగ్లేయులు భయపడుచుండిరి.

కలకత్తా వచ్చియున్నప్పుడు తాత్కాలిక వైస్రాయ్ నార్థ్‌బ్రూక్ దయానందుని తనతో కలువవలసినదిగా సందేశ మంపిరి. దయానందుడు నార్థ్‌బ్రూక్‌ను కలుసుకొనుటకు అంగీకరించెను.

వారు నిర్ణీత తిథియందు కలుసుకొనిరి. వారిమధ్య అనువాదకుడు (దుభాషీ) ఉండెను. మహర్షి సంస్కృత సంభాషణను ఆంగ్లము లోనికి, వైస్రాయి ఆంగ్ల సంభాషణను సంస్కృతములోనికి అనువదించుచుండెను.

మొదట కుశల ప్రశ్నలు గావించుకొనిరి. పిమ్మట వైస్రాయి దయానందు నుద్దేశించి యిట్లు పలికెను. "మీరు మత మతాంతరములలో అంధ విశ్వాసములను కటువుగా విమర్శించుచున్నారని తెలిసినది. వారు మీ యెడ ద్వేషము కలిగియున్నారు. ముఖ్యముగా ముస్లిములు, క్రైస్తవులు మీకు అపకారము తలపెట్టవచ్చును. మీరు మా ప్రభుత్వము నుండి రక్షణ గోరుచున్నారా?"

"నాకు బ్రిటిష్ ప్రభుత్వములో భావప్రకటన స్వాతంత్ర్యము కలదు. నాకు యెవరినుండి యెట్టి ప్రమాదము లేదు" అని మహర్షి సమాధాన మొసంగిరి.

అంత వైస్రాయి "అట్లయినచో మీరు మీ ఉపన్యాసములలో బ్రిటిష్ ప్రభుత్వము వలన పొందిన లాభములను పేర్కొనెదరా? మీ ప్రార్థనలో యీశ్వరుని భారతదేశముపై బ్రిటిష్ వారి అఖండ సామ్రాజ్యము కొనసాగవలెనని వేడెదరా?" యని ప్రశ్నించెను.

"నేనట్టి ప్రార్థన గావించజాలను. ప్రపంచ సభ్య దేశములతో సమానస్థాయి కలిగియుండుటకు నా దేశము విదేశీ పాలన నుండి విముక్తి జెంది స్వతంత్రమగుట అవసరము. నా దేశమునకు

స్వతంత్రము చేకూర్చవలసినదిగా ప్రాతస్సాయం సమయములందు యీశ్వరుని ప్రార్థించుచున్నాను" అని స్పష్టముగా మహర్షి యిచ్చిన సమాధానముతో వైస్రాయి తెల్లబోయెను.

ఇతర సన్యాసుల వలె దయానందుడు కూడా తన అధికార ప్రాభవము ముందు నత శిరస్కుడగునని వైస్రాయి భావించెను. కాని తన అభిప్రాయము తప్పని వెంటనే గ్రహించెను. అందుచేతనే లండన్‌కు 'దయానందుడు ప్రమాదకర సన్యాసి'యని, యీతని కనిపెట్టి యుండుట అవసరమని తెలియపరచెను.

మహర్షి నిమంత్రణపై క్రీ.శ. 1877 లో ఢిల్లీలో యీ క్రింద పేర్కొనినవారు సమావేశమైరి. 1. బాబూ కేశవచంద్ర సేన్, 2. సర్ సయ్యద్ అహమ్మద్‌ఖాన్, 3. మున్షీ కనయ్యాలాల్ అలఖ్‌ధారి, 4. మున్షీ యింద్రమణి మరియు 5. హరిశ్చంద్ర చింతామణి. కాని ఈ సమావేశములో సామ్రాజ్య శక్తుల గుప్త రాజనీతి పనిజేయుచున్నట్టు మహర్షి గ్రహించెను. ప్రత్యేక సంప్రదాయమునకు జెందినవారు తమ ప్రత్యేకతకు పాటుపడుచుండిరి.

దయానందుని యీ ప్రయత్నము విశుద్ధ జాతీయ ఆందోళనయై యుండెను. భారతీయులలో స్వతంత్రేచ్ఛ పరిపూర్ణముగా వికాసము జెందకుండెను. స్వతంత్రమను గమ్యమునకు చాలా దూరములో నుండిరి. దౌర్భాగ్య మేమన వారి విషయమును గమనించు స్థితిలో కూడా లేకుండిరి. కానిచో యేనాడో మనము స్వతంత్రమును సాధించి యుండెడివారము.

మహర్షి నిరాశ జెందలేదు. దేశవాసులలో మహర్షి తమ ఉన్నతమైన భావముల ద్వారా వారిని ధార్మిక, నైతిక రంగములలో ప్రత్యేక

స్థానమునకు యెదుగునట్లు ప్రయత్నించ సంకల్పించిరి. భారతీయులలో ఆత్మాభిమానము శిథిలమైనట్లు వారు గ్రహించిరి. దేశములో తాము తక్కువ వారమను భావము (Inferiority Complex) ప్రవేశ్యాను కొనెను. దయానందుడు ఉన్నతమైన నైతిక ఆదర్శములను దేశ వాసుల ముందుంచి భారతదేశము అత్యుత్తమ సభ్యత గలిగిన దేశ మనియు, సృష్టియొక్క మహోన్నత ధర్మము, విశిష్ట సంస్కృతి కలిగిన దేశమనియు విశ్వాసమును కలిగించిరి. ప్రపంచ దేశముల సభ్యతా సంస్కారములకు మూలాధారము భారతదేశమే యని అభివర్ణించిరి.

భారతదేశము ఆర్యావర్తముగా సుందరమైనదిగా స్వామీజీ పేర్కొనెను. "ఇచ్చటి జల వాయువులు ఉత్కృష్టమైనవి. ఇందు ఆరు ఋతువులు క్రమపద్ధతిలో యేర్పడినవి. ఈ దేశవాసులను 'దేవ్' అనగా విద్వాంసులుగా పేర్కొనబడినది. గంగా నదిని 'దేవనది' యని వ్యవహరించిరి. విశ్వమునందు వ్యాపించిన విద్య ఆర్యావర్తము నుండి ఈజిప్టు, అచ్చటనుండి యూనాన్ క్రమముగా వానినుండి రష్యా యూరపు, అమెరికాలకు విస్తరించినది" (స.ప్ర.సము. 278 పు.).

ఇంకను ఆర్యావర్తమును వర్ణించుచు దీనితో సరితూగగల దేశము వేరొకటి లేదని అందుచేతనే దీనిని "స్వర్ణభూమి"గా పేర్కొన నైనదని అభిప్రాయపడిరి. "పారస్‌మణి యినుమును బంగారముగా మార్చునని చదివియుంటిమి. పారస్‌మణి అబద్ధము కాని భారతదేశమునే పారసమణిగా వర్ణించవచ్చును. దీని సంపర్కములోనికి వచ్చిన దరిద్ర దేశము లన్నియు ధనాఢ్యములుగా మారిపోయినవి." (స.ప్ర. సము. 11 పుట 274).

ప్రాచీన భారత వైభవ పతనమునకు, రాజకీయ శక్తి లోపించు టకు గల కారణములను స్పష్టపరచెను. భారతీయులలో ఐకమత్యము

యుండియున్నచో తమ ధార్మిక, నైతిక, సామాజిక ఆదర్శములను విస్మరించకుండ యుండినచో, వ్యక్తిగత హితములకు బదులు దేశ హితమును కాంక్షించియుండి యుండినచో పాశ్చాత్య దేశములకు బానిసలము కాకుండా యుండెడివారము. మన స్వార్థము, విభేదాలు పాశ్చాత్యులకు మనదేశమందు కాలూనునట్లు జేసెను. దేశము యొక్క బానిసత్వము మహర్షికి అత్యంత బాధ కలిగించెను. దేశవాసు లెల్లరు సంఘటితులై బ్రిటిష్ వారి దాస్య శృంఖలాలు త్రెంచివేయవలెనని వారి అభిలాషగా యుండెను. స్వతంత్ర భారతదేశము మాత్రమే తన పూర్వపు ఔన్నత్యమును, వైభవమును సాధించగలదని వారి విశ్వాసము.

## అహింస మరియు సహాయ నిరాకరణ ఆందోళన

మహర్షి అహింస, సహాయ నిరాకరణ ఆందోళనకు అంకురార్పణ గావించెను. అప్పుడు ఈ సిద్ధాంతములు రాజకీయ రంగముపై ప్రస్ఫుటముగా, విరివిగా ప్రచార మొందలేదు. కాని పరోక్షముగా యీ భావ తరంగములు వ్యాపించుచుండెను. స్వదేశీ, విదేశీ అను ఆలోచనలు భవిష్య దుద్యమమునకు తోడ్పడెను.

## రచన, వాక్స్వాతంత్ర్యములు

మహర్షి దేశము యొక్క గౌరవ ప్రతిష్ఠలు, నైతిక విలువల ఔన్నత్యమును ప్రజలముం దుంచెను. సత్యము చెప్పుటలో యెంతటి మహత్తర శక్తికైనను భయపడవలసిన అవసరము లేదని చెప్పెను. అతని జీవిత మాతని ఉపదేశములకు సాకారముగా నిలిచెను. ఆతడు అవసరమనుకొనినప్పుడు క్రైస్తవ మతములోని లోపములను నిర్భయముగా ఖండించుచుండెను. ఆంగ్ల ప్రభుత్వము ఆగ్రహము చెందునని కూడా సందేహించలేదు. ఆతడెప్పుడు నిష్పక్షపాతముగా, నిర్భయముగా వ్యవహరించెను.

## రాజ్యము యొక్క ఆదర్శము

ఒక నిజమైన దేశ భక్తునిగా, రాజనీతిజ్ఞునిగా రాజనీతి, రాజ్యమునకు సంబంధించిన సమస్యలను మహర్షి వివరించెను. పాలకుడు, ప్రజల మధ్య గల సంబంధముపై వారి నిర్వచనము ప్రగతిశీలమై, ప్రజాస్వామ్యపద్ధతుల ననుసరించి యుండెను. మహర్షి ఊహించిన రాజ్యము రాజ్యాంగ శాసనబద్ధమై ప్రజాస్వామ్య విధానాల కను గుణ్యముగా నుండెను.

## పాలకుల లక్షణములు

సదాచారి, విద్వాంసుడు, న్యాయకారి, శౌర్య, ధైర్య పరాక్రమ ములు కలవాడే మహర్షి ననుసరించి పాలకుడై యుండవలెను. అతడు ఐశ్వర్యశాలి మరియు శత్రు సంహారకుడై యుండవలెను. యజు ర్వేదములో పాలకుల నెన్నుకొనుటలో వివరించిన నియమములను వారు సూచించిరి —

"ఇమం దేవా అసపత్నం సువధ్వం మహతే క్షత్రాయ
మహతే జ్యేష్ఠ్యాయ మహతే జానరాజ్యాయేన్ద్రి స్యేన్ద్రియాయ ॥
(యజు. అ. 9 మం. 40)

ఓ విద్వాంసులారా, ప్రజలారా! ఐశ్వర్య సంపన్నుడు, వినయ శీలుడు, విద్వాంసుడునైన వీరుని పాలకుడుగా నెన్నుకొని భూమండలము శత్రురహిత మొనరించుకొనుడు.

## ప్రజలకే అధికారము

రాజు సర్వస్వతంత్రుడుగా నుండరాదు. రాజు యొక్క స్వయం నిర్ణయాధికారము, నిరంకుశత్వము ప్రజోపకారి కాజాలదు. అతడు తనకు తోచినట్లు ప్రవర్తించి ప్రజలకు నష్టము కలిగించునని మహర్షి

అభిప్రాయము. అందుచేత యే ఒక్కరు సర్వస్వతంత్రులు కారాదు. సింహము బలమైన జంతువును చంపి తినునటుల సర్వస్వతంత్రుడైన రాజు ప్రజలను నాశనము చేయును. (స.ప్ర. సము. 6 పుట 135).

దీని ననుసరించి ప్రజలకు అధికార మీయవలెనని కాంక్షించెను. రాజు లేక సభాపతి కేవలము ప్రజా ప్రతినిధిగా నుండవలెను.

## రాజు, ప్రజల సంబంధము

రాజు, ప్రజల మధ్య సత్సంబంధము నెలకొని యుండవలెను. అప్పుడు మాత్రమే రాజ్యములో శాంతి సౌభాగ్యములు నెలకొనునని దయానందుని అభిప్రాయము.

"రాజు కన్నతండ్రి వలె, ప్రజలు బిడ్డల వలె పరస్పరము ప్రేమతో కలిసి మెలిసి యుండవలెను. ప్రజలు ధనాఢ్యులై, ఆరోగ్య వంతులై అన్నపానాదులు సమృద్ధిగా కలిగియుండుట రాజుకు శ్రేయస్కరము. రాజులేని ప్రజలు, ప్రజలు లేని రాజు వ్యర్థము. అందుచేత ఎవరి పరిధిలో వారు స్వతంత్రులై జీవించుట అవసరము. ప్రజల సామాన్య సంపత్తికి రాజు కాని రాజ పరివారము కాని వ్యతిరేకము కారాదు." (స.ప్ర.సము. 6)

## శాసనము మూడు సభలద్వారా జరుగవలెను

"త్రీణి రాజానా విదదే పురూణి పరి విశ్వాని భూషథః సదాంశి"
(ఋ.మం. 3 స. 38 మ. 6)

శాసన వ్యవస్థకై మహర్షి మూడు సభలయొక్క ఆవశ్యకతను తెలిపిరి. 1. విద్యార్య సభ : గొప్ప గొప్ప విద్వాంసులతో, ఆచార్యులతో కూడినదై యుండవలెను. 2. ధర్మార్య సభ : ధార్మికులు మరియు న్యాయవేత్తలతో నిర్మాణము కావలెను. 3. రాజార్య సభ : రాజ నీతిజ్ఞులు మరియు కుశాగ్రబుద్ధులైన శాసకులచే యేర్పాటు గావలెను.

ఈ మూడు సభలు కలిసి నియమము లేర్పాటు జేయవలెను. ఆ నియమములకు లోబడి పరిపాలన జరుగవలెను. వీరు అందరి హితమును దృష్టిలో పెట్టుకొనవలెను. ఈ సభలలో మూర్ఖులను యెప్పుడును జేర్చుకొనరాదు. (స.ప్ర. సము. 6 పుట 134-140)

1. విద్యార్య సభ : విద్యార్య సభ పర్యవేక్షణలో యీ క్రింది విభాగము లుండును. విద్య, కళలు, సంగీతము, భాషా ప్రచారము, పుస్తక ప్రచురణ, గ్రంథాలయములు, పురాతత్త్వ శాఖ మొదలగునవి.

2. ధర్మార్య సభ : సిద్ధాంతముల ప్రచారము, విదేశములలో వైదిక సంస్కృతీ ప్రచారము, ధార్మిక సంస్థల రక్షణ.

3. రాజార్య సభ : రాజార్య సభ అంతర్గతముగా ఆర్థిక, రెవిన్యూ, పోలీసు, సైన్యము, రక్షణ, జల, విద్యుత్, నగరపాలిక, వ్యవసాయము, ఎరువులు, వైజ్ఞానిక అనుసంధానము, వనము, గ్రామముల ఉన్నతి, విదేశ, పరిశ్రమలు, కార్మిక శాఖలు.

## మంత్రుల నియామకము

మహర్షి ననుసరించి రాజు యేడెనిమిది మందిని మంత్రులుగా నియమించవలెను. వారి సలహా సంప్రదింపుల ద్వారా అన్ని పనులు యోగ్యముగా నెరవేరగలవు. వీరు యోగ్యులు, బుద్ధిమంతులు, వీరులు, అనుభవజ్ఞులై యుండవలెను. ఇతర అధికారుల నియామకములో వారి వారి యోగ్యత, సత్ప్రవర్తనను దృష్టిలో పెట్టుకొనవలెను. పాలకులు ఆరు విషయములు ప్రతి నిత్యము మననము చేసికొనవలెను. మిత్రత్వము, విరోధము, సమయము వ్యతిరేకముగా నున్నప్పుడు మౌనముగా నుండుట, తన దేశపు రక్షణ, శత్రువులను సమయము జూచి సంహరించుట, సైన్యము, కోశము యొక్క రక్షణ, గెలిచిన

రాజ్యములో శాంతిస్థాపన, ఉపద్రవరాహిత్య మొనర్చుట అను సంధి, విగ్రహ, స్థాన, సముదాయ, గుప్తిమ, లబ్ధప్రశమనాని యను ఆరు విషయములను అవగాహన జేసుకొనవలెను. సభాసదుల అనుమతి లేకుండా రాజు స్వయముగా యే పని జేయరాదు. (స.ప్ర.సము. 6, పు. 143).

## రాజసభ యొక్క ఉద్దేశ్యములు

రాజు మరియు రాజసభ జేయవలసిన ప్రయత్నముల గూర్చి మహర్షి యిట్లు వివరించెను.

"పొందజాలని వస్తువులను పొందుట, పొందిన వానిని రక్షించుకొనుట, రక్షణలో కలదానిని వృద్ధి చేయుట, వృద్ధిపొందిన ద్రవ్యమును వేదవిద్య, ధర్మ ప్రచారము, విద్య, వేద మార్గోపదేశము, అనాథల పోషణకై వినియోగించుట యను ఈ నాలుగు విధములైన ప్రయోజనముల నర్థము జేసికొనవలెను. బద్ధకమును తొలగించుకొని ఈ క్రింది విషయముల పాటించవలెను

1. ప్రాప్తించని దానిని దండన వలన పొందుట, 2. నిత్యము పర్యవేక్షించుచు పొందిన దానిని రక్షించుకొనుట, 3. వడ్డీల వలన మరియు యితర విధముల ధనమును పెంపొందించుకొనుట, 4. పెరిగిన ధనమును పైన జెప్పిన విధముగా వ్యయము జేయుట. ఎవరినీ వంచించుట తగదు. అందరితో నిష్కపటముగా వ్యవహరించవలెను. శత్రువుయొక్క కపట ప్రవృత్తిని కనిపెట్టి తనను రక్షించుకొనవలెను. శత్రువు తన బలహీనతను కనిపెట్టు అవకాశ మీయక తానే శత్రువు యొక్క బలహీనతను కనిపెట్టవలెను. కొంగ ధ్యానావస్థలో నున్నటుల నటించి చేపను పట్టునట్లు ధన సంగ్రహ మొనరించవలెను. ధనమును, బలమును పెంచుకొని శత్రువుపై సింహమువలె ఆక్రమణ జరుపవలెను.

చిరుతపులి వలె పొంచియుండి శత్రువులను పట్టుకొనవలెను. బలవంతులైన శత్రువుల నుండి తాత్కాలికముగా పారిపోయి అదను జూచి ఆక్రమణ సలుపవలెను. జయించిన రాజ్యములో గల దొంగలను కొంత సొమ్ము యిచ్చిగాని, విభజించి గాని లేక సామ్యముతో గాని స్నేహ మొనరించుకొనవలెను. ఈ మూడింట సాధ్యపడనప్పుడు కఠినమైన శిక్షచే వశపరచుకొనవలెను. (స ప్ర. సము. 6, పు. 149)

## యుద్ధనీతి

యుద్ధనీతిని గురించికూడా మహర్షి తన అభిప్రాయముల వ్యక్త పరచెను. గత ప్రపంచ మహాయుద్ధములో సైన్యముతో పాటు ప్రజలు పొందిన వినాశము గోధుమలతో కూడిన పొట్టువలె నుండి విషాద కరముగా నుండెను. విజయము పొందిన వారు కూడా కొన్ని నైతిక నియమములను పాటించుట అవసరము. నిరాయుధులు, దుర్బలులు, గాయపడిన వారు, శరణాగతులపై ఆయుధములు ప్రయోగించరాదు. కాని విజయోన్మత్తులైన నేటి పాలకులు యిట్టి యుద్ధనీతిని విస్మరించి నారు. నేడు ప్రయోగించుచున్న విమానములు, బాంబులు, టాంకులు, మిషన్‌గన్‌ల ముందు నిరాయుధులు, అమాయకులు లక్షల సంఖ్యలో మరణించుట జరుగుచున్నది. కాని యుద్ధనీతిని గురించి దయానందుని అభిప్రాయము లిట్లు గలవు —

"యుద్ధ సమయములో యిరుప్రక్కల నిలుచున్న వారిని, నపుంసకులను, చేతులు జోడించిన వారిని, కూర్చున్న వారిని, శిరోజములు విడివడిన వారిని, శరణు పొందిన వారిని, పడుకొనిన వారిని, మూర్ఛ పొందిన వారిని, నగ్నముగానున్న వారిని, గాయపడిన వారిని, భయపడి పారిపోయెడి వారిని, దుఃఖితులై యున్నవారిని యోధులు యెప్పుడు సంహరించరాదు. వారిని బంధించి ఆరోగ్యముగా

నున్న వారిని కారాగారములో నుంచుట, గాయపడిన వారికి వైద్యము చేయించుట జరుపవలెను. కారాగారములో నున్న వారికి భోజన వసతి కల్పించి వారిని మర్యాదగా చూడవలెను. వారికి దుఃఖము కలిగించుట గాని, అవమానపరచుట గాని జరుగకూడదు. స్త్రీలను తమ కన్నకూతుళ్ళ మాదిరిగా చూచుకొనవలెను. వారియెడ కామ ప్రవృత్తి పనికిరాదు. (స.ప్ర. సము. 6)

ఇట్టి ఉన్నతమైన యుద్ధనీతిని నేడు విజేతలు విస్మరించినారు. జయించిన వారికి, జయింపబడిన వారికి కొన్ని నైతిక నియమము లుండును. కాని నేటి రాజనీతి దీనిని అవసరమని భావించదు. కొందరు రాజనీతి కోవిదుల మతానుసారము మొదటి ప్రపంచ యుద్ధము తర్వాత జర్మనీ పట్ల దుర్వ్యవహారము జరుపకుండినచో హిట్లరు ఒక భయంకర ప్రళయకారి శక్తిగా రూపొందెడివాడు కాడు. వార్సా సంధి పత్రము (క్రీ.శ. 1920)లో పొందుపరచిన విషయములు అవమాన జనకములుగా నుండెను. అట్టి అగ్గిరవ్వలే 20, 25 సంవత్సరములలో భూమండలముపై దావానలమై విస్తరించెను. పరాజయము పొందిన వారిని నిరాదరముగా జూచుట, వారిని గాయపరచుట వారియందు ప్రతీకార భావమును రగుల్కొలుపును.

## విజేతల, పరాజితుల సంబంధము

స్వామీజీ విజేత, పరాజితుల సంబంధమును స్పష్టపరచుచు యిట్లు పేర్కొనెను —

జయము పొందిన పిమ్మట ప్రమాణములు అనగా ప్రతిజ్ఞాదులు వ్రాయించుకొనవలెను. ఆ వంశస్థులలో యోగ్యులైన వారికి అధికారము కట్టబెట్టి, వారితో న్యాయసమ్మతముగా పరిపాలన జేయుదునని వ్రాయించుకొనవ . తిరిగి అట్టి ఉపద్రవము కలుగకుండునటుల

యేర్పాట్లు గావించుకొనవలెను. అతనిని సన్మానదృష్టితో చూడవలెను. కారాగారములో బంధించినప్పటికి ఆదర భావముతో చూడవలెను. ఇతరుల వస్తువులను స్వీకరించుట అప్రియముగా, యితరుల కిచ్చుట ప్రియమైనదిగా నెంచవలెను. ఓడిపోయిన వారికి కోరిన వస్తువులు యిచ్చుట సంతోషజనకము. వారిని ఓడించానని అవమానపరచరాదు. (స.ప్ర. సము. 6)

1942లో జెనీవా కన్వెషనులో (స్విట్జర్లండులో జెనివా సరస్సు యొక్క తీరముపై గల నగరము) యుద్ధ ఖైదీల యెడ జూపవలసిన ప్రవర్తనా నియమావళిని యిదే విధముగా రూపొందించినారు.

## పాలకులు మరియు రైతులు

రైతులు రాజ్యమునకు వెన్నుపూస వంటివారు. రైతుల వంటి శ్రామికులు రాజులకు రాజులు. రాజులు వారి రక్షకులు. వారు యిరువురు తమ పనులలో స్వతంత్రులు, సమాజహిత కార్యములలో పరతంత్రులై యున్నారు. (స.ప్ర.సము. 6)

రైతుల అభ్యుదయము కొరకై పాలకులు ప్రత్యేకమైన శ్రద్ధ చూపవలెను. శాసకులు రైతుల నుండి వారి శక్తి ననుసరించి పన్ను వసూలు జేయవలెను. పన్ను వసూలు జేయుటలో రైతుల పొలములో గల పంటను వశపరచుకొనుట తగదు.

## అడవిలో కట్టెపై మరియు ఉప్పుపై పన్నును వ్యతిరేకించుట

అడవిలో కలపపై, ఉప్పుపై పన్ను విధించుట రాజుకు తగదు. ఇవి ప్రతి వ్యక్తికి ప్రతి నిత్యము ఉపయోగపడు వస్తువులు.

క్రీ.శ. 1836లో బ్రిటిష్ ప్రభుత్వము ఉప్పుపై ఒక కమిషన్‌ను నియమించినది. బ్రిటిష్ వారి ఉప్పు అమ్మకమునకై భారతదేశ ఉప్పుపై అధికముగా పన్ను విధించబడినది. కమిషన్ నిర్ణయములు అమలు జేయుటకై బ్రిటిష్ ప్రభుత్వము ప్రకటన గావించెను.

ఈ నిర్ణయాన్ని వ్యతిరేకించుచు మహాత్మా గాంధీజీ 12 మార్చి 1930న సబర్మతీ ఆశ్రమవాసులు మరియు విద్యాపీఠ విద్యార్థులు 76 మందితో సహా దండియాత్ర ప్రారంభించెను. యాత్రను ప్రారంభిస్తూ మహాత్ముడు "భారతీయులపై ఉప్పు పన్ను ఘోర అత్యాచారము. ఈ అత్యాచారమును నేను సహించను" అని గర్జించెను. (కాంగ్రెసు చరిత్ర 1946 పు. 305).

పోలీసులలో ఉత్తములను చేర్చుకొనవలెను. న్యాయమునకు ఇదే ప్రథమ స్థానము. దీని తరువాతనే వాద వివాదములు నడుచును. అందుచేత న్యాయకారులను, శ్రేష్ఠ పురుషులను పోలీసులుగా నియమించవలెను.

## ఆంతరంగిక భద్రత

"సుపరిచితులైన దూతల ద్వారా రాజ్యము, రాజసేవకుల మంచి చేష్టలు తెలుసుకొనవలయును. దుశ్చేష్టలను విడిపించవలెను. మంచి కార్యములను పెంపొందించవలెను. అట్టి ప్రయత్నము యెల్లప్పుడు చేయవలెను. (ఋషి దయానందుని లేఖలు మరియు విజ్ఞాపన పు. 141

ఆంతరంగిక ప్రమాదముల నుండి పాలకులు సదా జాగ్రత్త వహించవలెను.

స్వామీజీ కథనము ననుసరించి మనుష్యులు ధార్మికులుగా నున్నంతవరకే రాజ్యము వృద్ధిజెందును. దుర్వ్యవహారము పెరిగిపోయి నపుడు రాజ్యము అంతరించును. మహర్షి అమూల్య వచనములు నేటి

పరిస్థితులలో అత్యంత ఆమోదయోగ్యము, ఆచరణయోగ్యము నై యున్నవి. వీటిని ఆమోదించనిచో స్వామీజీ ఆదర్శ రాజ్య స్థాపన లేక మహాత్ముని రామరాజ్య స్థాపన స్వప్నముగా మాత్రమే మిగిలిపోవును.

## బాహ్య భద్రత

బాహ్యసురక్షా వ్యవస్థను రెండు భాగములుగా విభజించవచ్చును 1. ఇతర దేశములతో మన సంబంధము, 2. శత్రు దేశముల నుండి మన రక్షణ. ఇక్కడ రక్షణ లేక భద్రతా ఉద్దేశ్యము విదేశాంగ శాఖ, రక్షణ శాఖతో సంబంధము కలదు. (స్వామీజీ పత్ర వ్యవహారము పు. 373, 374.)

## సంపూర్ణ స్వతంత్రతా కల్పన

మహర్షి దయానందుడు సత్యార్థ ప్రకాశములో యిట్లు వ్రాసెను. ఆర్యావర్తములో కూడా ఆర్యుల అఖండ, స్వతంత్ర, నిర్భయ స్వరాజ్యము యిప్పుడు లేదు. ఉన్న ప్రభుత్వము కూడా విదేశీయుల పాదాక్రాంతమై యున్నది. (స.ప్ర. పు. 126)

క్రీ.శ. 1909లో దాదాభాయి నౌరోజీ స్వరాజ్య నినాదము నిచ్చెను. 1916లో లోకమాన్య బాలగంగాధర్ తిలక్ "స్వరాజ్యము మా జన్మహక్కు" అని గర్జించెను. 1921లో పండిత జవహర్‌లాల్ నెహ్రూ సంపూర్ణ స్వరాజ్యమని గర్జించెను. నేడు భారతదేశము అఖండ మైనదికాదు. నిర్భయమైనది కాదు. దేశము ముక్కలు ముక్క లగు ప్రమాదము గలదు. భారతీయులందరు భయావరణలో చిక్కుకొని యున్నారు. స్వామీజీ అందరికి సమానముగా అన్నము, వస్త్రము, యిల్లు దొరకవలెనని కోరెను. అతడు రాజకుమారుడైనను, నిర్ధను డైనను అట్టి సౌకర్యము పొందవలెను. దేశములో నిష్క్రియత్వము,

బద్ధకము వలన దేశ ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమైనది. వేలమంది భారతీయులు కడుపునిండ అన్నముకైనను నోచుకొనలేదు. మెతుకు మెతుకు కొరకు తపించుచున్నారు. (మహర్షి దయానందుని జీవిత చరిత్ర, విద్యావాచస్పతి)

దేశ ఆర్థిక వ్యవస్థకు సంబంధించి స్వామి దయానందుడు విప్లవాత్మకమైన చర్య గైకొనుటకు సందేశమిచ్చెను. స్వదేశీ వస్తువుల ప్రయోగమును వాంఛించెను. ఒకమారు స్వామీజీని కలుసుకొనుటకై ఠాకూర్ భూపాల్‌సింహ విచ్చేసెను. అతడు తనవెంట తన కుమారుడైన ఊధోసింహను తీసుకొని వచ్చెను. ఊధోసింహ సూటు, బూటు ధరించి యుండెను.

మహర్షి ఊధోసింహను ఉద్దేశించి యిట్లు పలికెను. "ఇట్టి వస్త్రములు ధరించుటకు పూర్వము నీవు నీ తండ్రిని గూర్చి ఆలోచించి యున్నట్లయితే ఆ భేదము నీకు సహజముగా కన్పించి యుండెడిది. నీవు విదేశీ వస్త్రములలో నీ తండ్రికంటె యెక్కువ గౌరవము పొందగలుగుదువా?" స్వామీజీ మాటలాతనిపై గొప్ప ప్రభావము చూపెను. అప్పటినుండి ఊధోసింహ స్వదేశీ వస్త్రముల ధరించుట ప్రారంభించెను. (రాష్ట్రనేతా పుటలు 22-23)

## ఉదయపూర్ రాజాకు హెచ్చరిక

ఉదయపూర్ రాజాను హెచ్చరించుచు మనుస్మృతి ప్రమాణము నిచ్చుచు రాజెట్లు శాసించవలెనో పేర్కొనెను.

"నీ రాజ్య ప్రజలు అత్యంత దుఃఖితులై యున్నారు. రాజు ప్రజలను సుఖపెట్టవలెను. రాజ్యము యొక్క కర్తవ్యము శోషణ కాదు. వారి హితమును రక్షించుట రాజుయొక్క కర్తవ్యము." (స్వామి దయానంద్ పత్ర వ్యవహారము పుట 216)

## స్టాంపుడ్యూటీ నిషేధము

ప్రభుత్వము స్టాంపు పేపరు అమ్ముచున్నది. వాటి ధర కూడా పెంచినది. దీనివలన పేదవారికి బాధ కలుగుచున్నది. ఇది రాజు చేయవలసిన పనికాదు. చాలామంది అన్యాయము జరిగినను స్టాంపు డ్యూటీ భరించలేక మౌనముగా నుందురు. కోర్టులలో పైసా లేసిదే యే పనికాదు. అందువలన స్టాంపుడ్యూటీ న్యాయసమ్మతము కాదని నా ఉద్దేశ్యమని దయానందుడు చెప్పెను.

## నిర్బంధ విద్య

పాఠశాలలలో అందరికి సమానమైన వస్త్రము, అన్నపానములు, వసతి కల్పించవలెను. రాజకుమారుడైనను, నిర్ధనుడైనను అందరు తపస్వులు కావలసియున్నది.

బాలబాలికలు అయిదు లేక యెనిమిది సంవత్సరముల ప్రాయము దాటినచో నిర్బంధముగా పాఠశాలకు పంపునట్లు రాజ శాసనము లేక కులనియమము గావించబడవలెను. ఈ నియమము నతిక్రమించిన వారు దండనీయులగునట్లు శాసన ముండవలెను. (స.ప్ర. సము 3)

ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య యేర్పాటు జేయవలెను. ఇట్టి తీర్మానము 1908లో కాంగ్రెసు కమిటి ఆమోదించెను.

## ఆందోళన దిశలో

డోంగర్‌పూర్ సంస్థానములో బసియా గ్రామ ఆదివాసులు వేల సంఖ్యలో నివసించుచుండిరి. డోంగర్‌పూర్ సంస్థానపు జాగీర్దార్ గావించు అత్యాచారములు ప్రజలకు అసహనీయముగా నుండెను. ప్రజలు త్రాహి త్రాహియని మొరపెట్టుకొనుచుండిరి. మహర్షి దయానంద సరస్వతిచే 62 సంవత్సరముల ప్రాయములో దీక్ష తీసుకొనిన

డోంగర్‌పూర్ నివాసి గోవింద గురుజీ దేశభక్తుడు. 1880లో దీక్ష తీసుకొని 1881 వరకు గురుజీ స్వామీజీ వెంట నుండిరి.

జాగీర్దారు యొక్క పాశవిక చర్యలను విని గురుజీ డోంగర్ పూర్ చేరుకొనిరి. వారు చేరుటకు పూర్వమే జాగీర్దారు 500 మంది భిల్లులను వధించియుండిరి. ప్రజల దయనీయస్థితి గాంచి గురూజీ క్రీ.శ.1883 నుండి 1908 వరకు జాగీర్దారుకు వ్యతిరేకముగా రాజకీయ పోరాటము సలిపిరి. క్రీ.శ. 1883లో మహర్షి దయానందునితో గురూజీ తిరిగి కలియుట సంభవించెను. అజ్మీరునుండి ఉదయపూర్ వరకు గురూజీ స్వామీజీ వెంట నుండిరి. జాగీరు పరిస్థితిపై చర్చ జరిగెను. స్వామీజీ గురూజీని ఒక 'సభ్యసభ' యేర్పాటు చేయవలసిన దనియు ఆ సభలో జేరు సదస్యులకు యీ క్రింది నియమములు యేర్పరచవలసినదనియు సలహా నిచ్చిరి.

1. మద్య మాంసములు ముట్టరాదు, 2. తమ మధ్య యేర్పడు వివాదములను తామే పరిష్కరించుకొననలెను కాని కోర్టు కచేరీల కెక్కరాదు, 3. స్వదేశీ వస్త్రములను, వస్తువుల నుపయోగించవలెను, 4. జాగీర్దారు వద్ద వెట్టిచాకిరి మాన్పించవలెను, 5. బ్రిటిష్ ప్రభుత్వ మునకు, జాగీర్దారుకు పన్ను చెల్లించుట మానుకొనవలెను.

మహాత్మాగాంధీ 1917లో వెట్టివాకిరికి వ్యతిరేకముగా ఆందోళన జరిపియుండిరి.

పై ఘటన భారతదేశములో సహాయ నిరాకరణ రంగము సిద్ధము కాకపూర్వమునకు జెందినది క్రీ.శ. 1920లో సహాయ నిరాకరణోద్యమము ప్రారంభమయ్యెను. స్వామీజీ అత్యాచారము, అన్యాయములకు వ్యతిరేకముగా పోరాడుటకై గురూజీకి ఉపదేశము గావించెను. ఈ సంఘర్షణలో గురూజీ తన అసువుల గోల్పోయెను. వారి యీ బలిదానము రాజస్థాన్ యితిహాసములో స్వర్ణాక్షరములతో

లిఖింపబడినది వారి యీ సాహసకృత్యము భావి తరముల వారికి మార్గదర్శకముగా నున్నది. మహర్షి రాజస్థాన్ యాత్ర వలన యిట్టి ఆదర్శ పురుషులు వెలుగులోనికి వచ్చినారు.

స్వామీజీ రాజనీతి మరియు శాసనము విషయములో వెలువరించిన అభిప్రాయములు ప్రజలకు, శాసనకర్తలకు దగ్గరి సంబంధము యేర్పరచుచున్నది. వారి ఆదర్శ రాజ్యములో న్యాయము, ప్రేమ, సమానత్వము యొక్క ఆశయము లుండవలెను. సుఖశాంతులు, అభ్యుదయమునకు వలసిన సాధనములన్నియు సమకూర్చబడవలెను. స్వామీజీ నాడే వర్ణించిన రాజ్యము నేటి భాషలో సంక్షేమ రాజ్యము (**Welfare State**) అనబడుచున్నది.

మహర్షియొక్క ఉత్తేజకర ప్రేరణ చేతనే భారతదేశ స్వతంత్ర సంగ్రామములో ఆర్య సమాజము ప్రముఖ పాత్ర వహించినది. స్వామీజీ ప్రథమ క్రాంతికారి. శిష్యుడు శ్యాంజీ కృష్ణవర్మ, దేవతా స్వరూపుడు భాయీ పరమానంద్, అజిత్‌సింహ (భగత్‌సింహ చిన్నాయన), రాంప్రసాద్ బిస్మిల్, సర్దార్ భగత్సింహ, వీరసావర్కర్, లాలా హరదయాళ్, సర్దార్ అర్జున్‌సింహ (భగత్సింహ పితామహుడు) మొదలగు యితర వీరులు తమ ప్రాణములను పణముగా పెట్టి స్వతంత్ర దేవీ దర్శనము కలిగించినారు. తమ మాతృభూమి విదేశీ ముష్కరుల యినుప పిడికిలి నుండి విముక్తి గావించినారు.

ఋషివర్యా ! ఇదంతయు మీ ప్రేరణ యొక్క ఫలితమే. ఈ ప్రేరణ యుగాంతరముల వరకు బానిసత్వములో క్రుమ్మగుచున్న దేశములకు మూల మంత్రముగా సార్థకమగునుగాక.

"వైదిక ధర్మో విజయతామ్"